### ప్రకటన

## శ్రీహంపి విరూపాక్షస్వామి రథోత్సవము

పైరథోత్సవము చైత్ర శు॥ ... నుండి ... వరకు (7-4-49 నుండి 15-4-49 తేదీవరకు) మిగుల వైభవముగా జరుపబడును. 11-4-49 తేదీ సోమవారమునాటి కల్యాణోత్సవమున్ను 13-4-49 తేదీ బుధవారమునాటి రథోత్సవమున్ను ప్రత్యేకాకర్షణీయమైన ఉత్సవములు. కావున భక్తులు వేంచేసి ఈ మహోత్సవములయందు పాల్గొని శ్రీ దేవుని కృపకు పాత్రులయ్యెదరుగాక.

హంపి. 29-3-49. — జి. శంకరయ్య, దివాన్.

### ప్రకటన

## శ్రీ శ్రీ శ్రీ సింహాచలక్షేత్రము - శ్రీ వరహాలక్ష్మీనృసింహస్వామివారి కల్యాణము

శ్రీ శ్రీ శ్రీ వరహాలక్ష్మీనృసింహస్వామి వారి కల్యాణమహోత్సవము 9-4-49 తేదీ నుండి 12-4-49 తేదీవరకు సింహాచలము కొండమీద అతివైభవముగా జరుపబడును. దినదిన కార్యక్రమము అచ్చు పత్రిక సింహాచలము అమీనుగారివద్ద దొరకును.

P. Ramachandra Rao,
11-3-49. దివాన్.

### కావలెను

## ఏలూరు మ్యునిసిపాలిటీ, ఏలూరు

ఈ క్రింది పోస్టులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.

1. టౌన్ ప్లానింగ్ అండ్ బిల్డింగ్ సూపర్వైజర్, రు 100-5-150.
2. టౌన్ ప్లానింగ్ అండ్ బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్, గ్రేడు II రు. 70-3-115.
3. టౌన్ ప్లానింగ్ సర్వేయర్, గ్రేడ్ II రు. 60-3-90-2-75.
4. బిల్డింగ్ డ్రాఫ్ట్స్‌మన్, గ్రేడ్ II రు. 50-3-95-2-75.

1 నుండి 4 వరకూ, అర్హతల విషయము జి. వో. నెం. 2871 పి. హెచ్. డి 14-10-1944 ను చూడుడు.

5. ఇంజనీరింగ్ డ్రాఫ్ట్స్‌మన్, గ్రేడ్ II రు. 50-3-95-2-75.

అర్హతలకు జి. వో. నెం. 149 ఎల్. ఎస్. జి. 25-1-1944 చూడుడు.

మరి:— మామూలు రేట్ల ప్రకారము కరవు భత్యము యివ్వబడును.

అప్లికేషను ఫారం 1 కి రు 1/-

అప్లికేషనులు అందుటకు చివర తేది 11-4-49 సాయంకాలం 4 గంటలకు.

డి. విశ్వనాథరెడ్డి,
కమీషనర్.

### ప్రకటన

అనంతపురం జిల్లా - ధర్మవరం తాలూకా గంగినేపల్లి గ్రామం దేవత నాగప్ప భార్య చిన్నశంకరమ్మ సర్వులకు తెలియపరచడము ఏమనగా:—

4-3-49 తేది దేవత చిన్నసుబ్బరాయుడు 17-3-49 తేదిలు వెలువడిన ఆంధ్రపత్రికలో వ్రాసిన విషయములు సరియైనవి కావు. నా భర్త దేవత నాగప్ప 21-7-1947 తేది తన యావదాస్తులు, నాకు సర్వాధికారములతో చెందులాగునను, నేను యిష్టపడిన, దత్తుతీసుకొనుటకు అధికారముయిస్తూ నా పేర వీలునామా వ్రాయించి, రిజిష్టరు చేయించినాడు. అందువలన నా భర్త దేవత నాగప్ప ఆస్తి దానవిక్రయాదులు చేయుటకు నాకు సర్వాధికారము వున్నది. నా భర్త తమ్ముడైన గంగినేపల్లి దేవత చిన్నసుబ్బరాయుడికి, నా భర్త ఆస్తిలో ఏలాటి సంబంధము లేదు. వీరు పూర్వులు 1-2-1922 తేదిన విభాగాలు చేసికొని, భాగదస్తావేజు రిజిష్టరు చేసుకొనియున్నారు. వీలునామా ప్రకారం నాకు సర్వాధికారము వుంటున్నది. అందువలన పై దేవత చిన్నసుబ్బరాయుడు నాచే చేయబడు దానాధీన వ్యవహారాది విక్రయములను ఆక్షేపించుటకు, ఎంతమాత్రము అధికారము లేదు. అతడు వృథావాది కాదు.

దేవత చిన్నశంకరమ్మ,
18-3-1949. గంగినేపల్లి.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras

## బర్మాలోని భారతీయుల సమస్య

### డా॥ బి. వి. కేస్కార్ ప్రకటన

న్యూఢిల్లీ, మార్చి 31: రంగూను జిల్లాలోని భారతీయులు తమ్ము అక్కడనుండి ఖాళీ చేయించవలసినదని భారత రాయబార కార్యాలయమున రిట్టు దాఖలు చేసియుండలేదని, అక్కడి భారతీయులు 500 మంది దాదాపు శాశ్వత నివాసులేనని నేడు భారత శాసనసభలో శ్రీ ఆర్. కె. సిధ్వాగారడిగిన ప్రశ్నకు ఉప విదేశాంగ మంత్రి డా॥ బి. వి. కేస్కార్ సమాధానమిచ్చెను.

రంగూను ప్రాంతంలో తప్ప మిగతా చాలా చోట్ల కల్లోలముగా ఉండుటచే రంగూను నుండిగాని, మరేచోటినుండిగాని భారతీయులను ఖాళీ చేయించుట అసాధ్యమనీ, రైలుబండ్లు నడవకుండుటవలన, రోడ్లు బందిపోటు దొంగలతో నిండియుండుటచేత రాకపోకలు ప్రమాద భరితముగా యున్నవనీ కూడ డా॥ కేస్కార్ ప్రకటించెను.

బర్మాలో పిస్తోలవల నష్టపడిన భారతీయుల సంఖ్యను చెప్పుట కష్టమనీ, కాని విప్లవ కల్లోలం వ్యాపించిన ప్రదేశాలలో నివసించే భారతీయులసంఖ్య సుమారు లక్ష అనీ, రంగూనులో భారతీయులు 2 లక్షలదాకా ఉన్నారనీ ఆయన వివరించెను.

మన్నోహనదాసుకు సమాధానమిచ్చుచు, ఇప్పటికి 4 వేలమంది భారతీయులు ఇండియాకు వచ్చినారనీ, వీరికి పునరావాసం కల్పించబడకపోయినా ఇతరసహాయం చేయబడుచున్నదనీ డా॥ కేస్కార్ తెలిపెను.

అరుణ చంద్రగుప్త:— బర్మాలో విప్లవం వృద్ధిచెందుచున్నది. 1942 లో నేల మార్గాన భారతీయులు అసంఖ్యాకంగా వచ్చినట్లుగా ఈసారి రాకుండా ప్రభుత్వమేమైనా చర్యలు తీసుకొనుచున్నదా?

జవాబు:— ప్రభుత్వము పరిస్థితిని కనిపెట్టుచునేయున్నది. 1942 లో జరిగినట్టు జరుగకుండా చర్యలు తీసుకొనుచున్నాము.

సిధ్వా:— మణిపూర్ సంస్థానంలోనికి ఎవరైనా అక్రమంగా ప్రవేశించినారా? ఈ విషయమై అస్సాం ప్రభుత్వం కేంద్రమునకేమైనా తెలియపరిచినదా?

జవాబు:— ప్రభుత్వమునకు తెలిసినంతవరకూ మణిపూర్‌లోనికి ఇంతవరకు ఎవ్వరూ చొరబడి రాలేదు. కొద్దిమంది మాత్రం విడివిడిగా మణిపూరుకు వచ్చిరి. భారత సరిహద్దులను దాటి ఎవరూ రాకుండా ప్రభుత్వము వేయికండ్లతో కనిపెట్టుచున్నది.

తూర్పు పాకిస్థాన్‌లోనికి బర్మీస్ కమ్యూనిస్టులు చొరబడుకుని రాకుండా చేసే నిమిత్తం పాకిస్థాన్—బర్మా సరిహద్దు మూసివేయబడినట్లు తెలియుచున్నదని డా॥ కేస్కార్ లిఖితపూర్వకంగా ఒకరికి సమాధానమిచ్చెను.

ఇండియా, బర్మా సరిహద్దును కూడా మూసివేయుటకు ప్రభుత్వము ఆలోచించుచున్నదాయనీ, ఇతర కొండజాతులవారిని కూడా ప్రభుత్వము గమనించుచున్నదనీ, ఒకరడిగిన ప్రశ్నకు సమాధానంగా, పరిస్థితులు ఇంకనూ బర్మా సరిహద్దును మూసివేయునంతవరకూ రాలేదనీ, కొండజాతులవారితో ప్రభుత్వసంబంధము లింతవరకూ సంతృప్తికరముగనే యున్నవనీ డా॥ కేస్కార్ చెప్పెను.

## గాంధి స్మారకనిధికి విరాళములు

పూర్ణియా (బీహారు), మార్చి 21: డా॥ రాజేంద్రప్రసాద్‌గారు భాగల్పూరు నుండి యిచ్చటకువచ్చినప్పుడు పూర్ణియా ప్రజలు గాంధీ స్మారకనిధికిగాను రూ. 1,70,780 సమర్పించిరి. ఈ జిల్లాలో నిధికి యింతవరకు వసూలైన మొత్తము రూ. 6,31,876 ననబాము ప్రజలు నిధికి రూ. 36900 సమర్పించిరని అచ్చటనుండి వార్త వచ్చినది.

## ఏప్రిల్ 11 న దేశవస్త్ర పరిస్థితికై ఢిల్లీలో సమావేశం

బొంబాయి, మార్చి 31: దేశంలో ప్రత్తిపంటలు ఎట్లు ఉన్నవీ వస్త్రోత్పత్తి ఎట్లు సాగుచున్నదీ పరిశీలించుటకు భారత ప్రభుత్వ పరిశ్రమలశాఖ మంత్రి డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీగారు న్యూఢిల్లీలో రాష్ట్ర సంస్థాన ప్రభుత్వ ప్రతినిధులతో ఏప్రిల్ 11 వ తేదీన 2వ సమావేశమును జరుపనున్నారు. మిల్లులకు ప్రత్తి కావలసినంతగా లభ్యం కావడంలేదు. అందుచేత ప్రభుత్వం కంట్రోల్సును సడలించి విదేశీప్రత్తిని యథేచ్ఛగా దేశంలోకి దిగుమతి కావించుచున్నది. ఇందువలన పరిస్థితి కొంత బాగుపడుచున్నది. కాని కటకట పూర్తిగా తీరలేదు. ఆ ప్రత్తి కొరత తీర్చుటకు ఏలాగ ఉన్నది. సమావేశంలో ప్రధానచర్చనీయాంశం అవుతుంది.

## మాస్కోలో రాయబారిగా నా అనుభవాలు

### శ్రీమతి విజయలక్ష్మీపండిట్ వివరణ

మాస్కో, మార్చి 31: వాషింగ్టనులో రాయబారిగా నియమింపబడి, మాస్కో నుండి తరలుచున్న, శ్రీమతి విజయలక్ష్మీ పండిట్, రష్యాలో రాయబారిగా యీ 18 మాసములనుంచీ తనకుగల అనుభవమును యీ దిగువ ప్రకటనద్వారా తెలియజేయుచున్నది.

"సోవియట్ యూనియనులో ప్రథమ రాయబారిగా నియమింపబడినందుకు చాలా సంతోషించుచున్నాను. అల్పకాలం మాత్రమే ఇక్కడ ఉండగలిగినందుకు విచారిస్తున్నాను. ప్రపంచ సంఘర్షణ దినదినం పెరిగిపోవటం కారణంగా, ఈ మహాదేశంనుంచి అనుకున్నంత లాభాన్ని సాధించలేకపోయినాను.

"భారతదేశం సేవచేస్తూ నేను మాస్కోలో వున్నా, వాషింగ్టనులో వున్నా ప్రపంచ శాంతి ఏకైకాశయంగా ప్రవర్తించుతాను. "అంతర్జాతీయ సహకారంలో భారతదేశం, ఇదే కార్యభారాన్ని నిర్వర్తించుతుంది. మా విదేశాంగ విధానమంతా యీ సూత్రాన్నే అంటిపెట్టుకొనివుంటుంది.

"ఇనో ఒక కూటమిలో చేరటము కానీ, బలహీనంగా యే కూటమికో ఒక కూటమికి వెనుక నుండి తాళం వేయటానికి పూనుకోటంగాని యెన్నటికీ జరగదు. అన్ని దేశాల మైత్రినీ మేము వాంఛిస్తున్నాం. ప్రపంచాన్ని ఎదుర్కొంటున్న మహాసమస్యల నన్నిటినీ సత్తించి వాటిని పరిష్కరించటానికి సాధ్యమైన పంథాగా ఈ విధానాన్ని మేము స్వీకరించి పనిచేస్తున్నాం.

"శాంతి మా పరమలక్ష్యం. ప్రపంచ సంఘర్షణను తొలగించటానికి మా పలుకుబడిని సర్వధా వినియోగించుతాం.

"అమెరికాకు లోగడ నేను అనేక పర్యాయములు వెళ్లాను. అమెరికన్ ప్రజలు నాయెడ యెంతో సౌహార్దం ప్రదర్శించారు. ఇరుదేశాలకూ లాభదాయకమయ్యే రీతిని భారత అమెరికాల మధ్యవున్న స్నేహాన్ని పెంపొందించటానికి ఇతోధికంగా ప్రయత్నించుతాను.

"అమెరికా రాయబారిగా నియామకం బయల్పడినప్పటినుంచి, యిప్పటివరకూ, నాకు, అమెరికాలోని వివిధ సంఘముల నుంచీ, అనేక అభినందనలు వచ్చాయి. భారతదేశమును గురించి ప్రసంగించవలసినదిగా అనేక ఆహ్వానాలు వచ్చాయి. భారతదేశంపట్ల అమెరికా ప్రజలకు ఇంత ఔత్సుక్యము ఉన్నందుకు సంతోషించుచున్నాను. కాని ఇప్పుడు తొందరపడి నేను ప్రసంగమూ చేయటానికి వీల్లేదు. రాయబారిగా అక్కడ నేను అధికారం స్వీకరించిన తర్వాతగాని, ఆ విషయ మేమీ ఆలోచించలేదు."

నిన్నటిదినం ఆఫ్ఘనిస్థాన్ ప్రతినిధి వర్గానికి స్వాగతం చెప్పటానికి స్పిరిడనోవ్కా భవనంలో విదేశాంగశాఖవారు యేర్పాటుచేసిన విందులో శ్రీమతి పండిట్ పాల్గొన్నది. తరువాత ఫిన్లిష్ ప్రధాని కేసన్‌పెర్‌ స్టోమ్‌తో భోజనం చేసింది.

రేపటిరోజు విమానంలో బయలుదేరి స్టాక్‌హోమ్ చేరుకుంటుంది. అక్కడినుంచి లండనుమీదుగా తరువాత భారతదేశానికి వెళ్లిపోతుంది.

## అవసరవస్తువులపై అమ్మకం పన్ను నిషేధం

కలకత్తా, మార్చి 31: వార్తాపత్రికలు, నిప్పుపెట్టెలు, ఆవనూనె, తెలకనూనెలపై అమ్మకంపన్ను తొలగించటానికి పశ్చిమ బెంగాలు ప్రభుత్వం నిశ్చయించింది.

### కాకినాడ సారస్వత సంఘ వార్షికోత్సవం

కాకినాడ, మార్చి 29: స్థానిక సారస్వత సంఘ వార్షికోత్సవం గత ఆదివారంనాడు అనరాపురపు హనుమంతరావుగారి అధ్యక్షతక్రింద జరిగెను. సారస్వత సంఘ అభివృద్ధినిగురించి, దానిలోని లోపాలను గురించి వీరేశ్వరపు సుబ్బారావుగారు ప్రసంగించిరి. ఆటలపోటీలలో గెలుపొందిన వారికి బహుమతులొసగబడెను.

### శ్రీ అన్నమాచార్యోత్సవం

తిరుపతి, మార్చి 29: శ్రీ తాళ్లపాక అన్నమాచార్యోత్సవము ఏప్రిల్ 2, 3, 4 తేదీలందు తిరుపతిలో దేవస్థానం కమిటి యాజమాన్యాన జరుగును. మదరాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారుగారు ఉత్సవములను ప్రారంభించెదరు. ఆంధ్రదేశంలో ఉండు ప్రముఖ సంగీతవిద్వాంసులు, కవులు, పండితులు యీ ఉత్సవంలో పాల్గొందురు. విజయవాడ రేడియోవారు ఉత్సవ కార్యక్రమమునంతయు తిరుపతినుండి ప్రసారం చేయుటకు ఏర్పాట్లు చేయుచున్నారు.

తెనాలి తాలూకా అన్నవరంలో మార్చి 29 న నూతనంగా తపాలా ఆఫీసు ఏర్పాటు చేయబడెను.

## కార్మికతగాదా పరిష్కార మండలి అధికారం

### ఫెడరల్‌కోర్టు తీర్పు

ఢిల్లీ, మార్చి 31: కార్మికులకును మిల్లు అధికారులకును మధ్యకలిగిన తగాదాలను పరిష్కరించుటకై కార్మికతగాదా పరిష్కారచట్టమును అనుసరించి నియమింపబడే పరిష్కారమండలికి ఎట్టి అధికారము కలదనే విషయమై ఫెడరలుకోర్టు నేడు తీర్పు చెప్పెను. మిలు అసాములు బర్తరఫ్ చేసిన నౌకరులను తిరిగి పనిలో చేర్చుకోవలెనని ఆజ్ఞాపించుటకు సదరు పరిష్కారమండలికి అధికారము కలదా? అను విషయమై వివాదము వచ్చెను.

వెస్టరను ఇండియా ఆటోమొబైలు అసోసియేషను (బొంబాయి), ఇండియా పేపరు మిల్సు కంపెనీ (కలకత్తా), నార్తు బెంగాలు ఇన్సూరెన్సు కంపెనీ (కలకత్తా) కాస్పు అండు కేంప కంపెనీ (కలకత్తా) అను కంపెనీవారు ఫెడరలుకోర్టునకు అప్పీలు చేసిరి. ఎదిరిపక్షము కార్మికతగాదా పరిష్కారాధికారమండలియును, పై చెప్పిన కంపెనీల కార్మిక సంఘములును యీ అప్పీలులో రెస్పాండెంట్లుగా నున్నారు. వేర్వేరు వ్యాపారపు కంపెనీలు పైవిధముగా దాఖలుచేసిన 9 అప్పీలు కేసులు ఫెడరలుకోర్టులో విచారణకు వచ్చెను.

ఈ 9 అప్పీళ్ళలో ప్రధానమైనది వెస్టరను ఇండియా ఆటోమొబైలు అసోసియేషను (బొంబాయి) వారిది. వీరికి ఎదిరిపక్షముగా బొంబాయి ప్రభుత్వముచే నియమింపబడిన కార్మికతగాదా పరిష్కార మండలియును తదితరులును రెస్పాండెంట్లుగా ఉన్నారు. ఈ అప్పీలు కేసులు ఫెడరలు కోర్టులో ఫుల్‌బెంచి యెదుట గత జనవరి ఫిబ్రవరి మాసములందు ఉభయపక్షవాద ప్రతివాదములు జరిగెను.

ఈ కేసులోని ముఖ్య సారాంశము లేవనగా:—

(1) బర్తరఫు చేయబడిన పనివాండ్లను తిరిగి పనిలో చేర్చుకొనవలయునని ఆజ్ఞాపించుటకు ఉత్తరువు చేయుటకు కార్మిక తగాదా పరిష్కారమండలికి అధికారమున్నదా?

(2) రాష్ట్రీయ ప్రభుత్వముగాని, ఏదైనా ఒక స్థానికాధికార సంస్థగాని యాజమాన్యము కలిగియున్నట్టి పరిశ్రమలలో పనిచేయు కార్మికుల తగాదాల విషయములో మాత్రమే కార్మిక తగాదా పరిష్కారచట్టము వర్తించునా? లేక ప్రయివేటు అసాములకు గల పరిశ్రమల విషయములో కూడా వర్తించునా?

మొదటి సారాంశము విషయములో ఫెడరలు కోర్టు యీక్రిందిరీతిగా తీర్పు చెప్పెను. బర్తరఫుచేయబడిన కార్మికుల విషయమైకూడా కార్మిక తగాదా పరిష్కారమండలి విచారణ చేయుటకు అధికారము కలిగియున్నది.

రెండవ సారాంశము విషయములో ఫెడరలు కోర్టు యీక్రిందిరీతిగా తీర్పు చెప్పెను.

1947 సం॥రపు కార్మికతగాదాల చట్టము కేవలము గవర్నమెంటువారి యాజమాన్యముక్రింద ఉండే పరిశ్రమలకు మాత్రమే గాక ప్రయివేటు అసాముల పరిశ్రమలకు కూడా వర్తించును.

కార్మిక తగాదాల పరిష్కారమై కల్పింపబడిన ఈ అధికారముగ్గాయు కేవలము ప్రభుత్వ సంస్థలకు మాత్రమే వర్తించునని వాదింపవీలులేదు.

ఈ ప్రధాన అప్పీలులో చెప్పబడిన పైతీర్పు మిగిలిన 8 అప్పీళ్లకు కూడా వర్తించును.

అప్పీలు ఖర్చులతో సహా కొట్టివేయబడెను.

## ఏప్రిల్ 1 నుంచి తపాలా మార్పులు

బొంబాయి, మార్చి 31: రేపటినుంచి దేశమంతటిమీద టపా అంతా సాధ్యమైనంతవరకు విమానాలలోనే వెళ్తుంది. కవర్ల ఖరీదు 2 అణాలు, కార్డుల ఖరీదు 1 అణావు పెంచబడినది. కాని టపాలు విమానములలో తీసుకొని వెళ్తున్నందుకు ప్రత్యేకంగా రుసుమేమీ వసూలు చేయబడదు. ఉత్తరాలు పోస్టుకార్డులు ఎక్కువైనంతవరకూ విమానములలో తీసుకొనివెళ్లి, మిగతా దూరం రైళ్ళలో పంపుదురు.

ఉత్తరాలకు కార్డులకు యికనుంచి నీలపురంగు లేబిళ్లు అంటించ నవసరంలేదు. బుక్‌పోస్టుద్వారా పంపే బంగీలకు మాత్రం విమానాలలో వెళ్ళవలెనంటే అదనపు రుసుము వసూలుచేయబడును. ఈ అదనపు రుసుము తులానికి 1 అణా అని నిర్ణయింపబడినది.

ఇదివరకు అమ్ముతున్న 2½ అణా విమానటపాకవర్లు యికనుంచీ అమ్మబడవు.

విదేశములకు వెళ్ళవలసిన విమానటపా చార్జీలలో మాత్రం యే విధమైన మార్పు చేయబడలేదు.

## ఫ్రెంచి ఇండియా - భారతదేశముల మధ్య ప్రయాణము

### ఏప్రిల్ 15 నుండి అనుమతి పత్రములిచ్చుపద్ధతి అమలు

న్యూఢిల్లీ, మార్చి 31: భారతయూనియనునుండి ఫ్రెంచి భూభాగములను, పుదుచ్చేరి, కరైకలును, పుదుచ్చేరి, కరైకలుల నుండి భారత యూనియనుకు ప్రయాణము చేయువారికి అనుమతిపత్రము లొసంగు పద్ధతి యిదివరలో ప్రకటింపబడినట్లు ఏప్రిల్ 1 తేదీన గాక ఏప్రిల్ 15 తేదీన అమలులోనికి వచ్చునని భారతప్రభుత్వము వారు ప్రకటించుచున్నారు. అనుమతి పత్రములిచ్చుటకు సంబంధించిన ఏర్పాటులింకను పూర్తికాకపోవుటచేత తేదీ మార్చబడినది.

### వస్తువులరవాణా నిలుపుదల

కరైకలు, మార్చి 31: భారత యూనియను - ఫ్రెంచి ఇండియా సుంకముల ఒడంబడిక ఏప్రిల్ 1 తేదీన రద్దు కాబోవుటచేత భారతయూనియనువారు కరైకలుకు ఫిల్మ్‌లు, కాయితములు, కూరగాయల రవాణాను ఆపుచేసిరని యిచ్చటికి వార్త వచ్చినది.

### ఫ్రెంచి ఇండియా కమ్యూనిస్టుల విడుదల

పాండిచ్చేరి, మార్చి 31: భారతయూనియనులో డిటెన్షనులోనున్న ఫ్రెంచి ఇండియన్ కమ్యూనిస్టులందరు విడుదలలై, వారివారి స్థలములకు వెళ్ళ ననుమతింపబడియుండగా ఫ్రెంచి ఇండియా ప్రభుత్వమువారు మహా. మహాజనసభ నాయకులపైనను, కార్యకర్తలపైనను జారీచేయుండిన వారంటు యింతవరకు రద్దు చేయలేదని తెలియుచున్నది. ఈ నాయకులు, వర్కర్లు మొత్తం 175 మంది యున్నారు. ఇప్పుడు వీరు భారత యూనియను భూభాగములో నున్నారు. దూరదేశములో వీరు జీవనోపాధి లేక దుర్భర కష్టముల పాలగుచున్నారని, వారు వాజరున లేకపోవుటచేత స్వస్థలములయందలి వారి ఆస్తి పాడైపోవుచున్నదని తెలియుచున్నది. మహాఖండలి చాలామంది ఫ్రెంచి ఇండియన్ పోలీసులను కరైకలు, పుదుచ్చేరిలకు మార్చి, అచ్చట, మహా మహాజనసభ నాయకులతోను వారు సానుభూతి జూపెదరను కారణమున బర్తరఫ్ చేసిరనికూడ తెలియుచున్నది.

### శ్రీ జగజీవన్‌రామ్ అస్వస్థత

ఢిల్లీ, మార్చి 31: కార్మికశాఖామంత్రి శ్రీ జగజీవన్‌రామ్‌గారు అస్వస్థులై యున్నారు. సంపూర్ణముగా విశ్రాంతి గైకొనవలసినదని వైద్యులు వారికి సలహా నొసంగిరి. ఈ కారణముచేత వారి బీహారు, ఒరిస్సా పర్యటన కార్యక్రమము రద్దయినది.

## బందరు ఫ్రెంచిపేటలో మునిసిపల్ పన్నుల విధింపు

### ప్రజల ఆక్షేపణ

మచిలీపట్నం, మార్చి 31: బందరు ఫ్రెంచిపేట వాస్తవ్యులు నిన్న సాయంకాలం శ్రీ నవ్వంతిని ఆశ్రమంలో చాలి సూర్యప్రకాశరావుగారి అధ్యక్షతను సభ జరిపి 'ఫ్రెంచిపేట ప్రజాసంఘం' అనే పేరుతో ఒకసంఘమును ఏర్పాటు చేసిరి. దానికి చాలి సూర్యప్రకాశరావుగారు అధ్యక్షులుగను, టి. పి. శంకరరావుగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి. మదరాసు జిల్లా మునిసిపాలిటీల చట్టంలోని 4 (2) సెక్షన్ ప్రకారం రాష్ట్రప్రభుత్వము ఫ్రెంచిపేటను మచిలీపట్నం మునిసిపాలిటీలో చేర్చుచున్నామని తెలుపుతూ ఆక్షేపణలున్నయెడల తెలుపవలెనని గెజెటు ప్రకటన చేయలేదు కావున, మచిలీపట్నం మునిసిపాలిటీవారు ఫ్రెంచిపేటలో పన్నులువిధించుట, వసూలుచేయుట న్యాయసమ్మతం కాదనియు, యిప్పటికి వసూలుచేసిన పన్నులసొమ్మును ఫ్రెంచిపేట వాస్తవ్యులకు వెంటనే వాపసు చేయాలని మునిసిపాలిటీని కోరుచూ ఒకతీర్మానం చేయబడెను. మునిసిపాలిటీ అధికంగా వసూలుచేసినపన్నును వాపసుచేయని సందర్భంలో నూతనంగా ఏర్పడిన ఫ్రెంచిపేట ప్రజాసంఘ కార్యవర్గంవారు అవసరచర్యలన్నీ తీసుకొనవలెనని వేరొక తీర్మానం చేయబడెను.

## మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 1:

వేరుసెనగ: (581 వా 1-8 ఎస్సు కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు (కొత్తది) రు. 138 1.0

వేరుసెనగనూనె ఎక్స్‌పెల్లర్ (గ్యారంటీ) (సేల్సుటాక్సుతో సహా) రు. 8[illegible]

ఆముదం బజారు డెలివరీ ఎక్స్‌పెల్లర్ ఇంగ్లీషుకాండీ 500 పౌనులు కలది రు. 335, 338

కొంకాయనూనె (89 పౌను గల డబ్బా) ఒకటికి రు. 83-[illegible]

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-8 ఎస్సార్డు బొంబాయి సేల్సుటాక్సుతో సహా రు 73-8-0 పెట్లా బంగారు తులం 110-12-0 నూతనబంగారు 109-0-0 సీమవెండి తులం 100-8 (రెడీ) 179-0-0 వెండి తులం 1 కి 1-13 6.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, మార్చి 31:

మే 32.27/32.28 జూలై 31.20/31.20 అక్టోబర్ 28.43/28.45 డిసెంబరు 28 20/20 నా. మార్చి 28 06 [illegible] 8.07/ఎక్స్ఛేంజ్ మే 27.88/డిసెంబర్ 27.8[illegible]/ ఆఫ్ట్రేడ్ జూలై 25.78/ నా.

| | | |
|---|---|---|
| మిడ్లింగ్ | పోజరు | 33.57 |
| మే | (గరిష్ఠధర) | 32.31 |
| | (కనిష్ఠధర) | 32.25 |

మే వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | జెల | 32 23 |
| నిన్న | | 32 20 |
| ,, ముగింపు | జెల | 32 27 |
| నిన్న | | 32.28 |



## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే

సవరణ చేయబడి 1-4-1949 నుండి అమలులోనికి వచ్చు టైంటేబిల్సులో, అనేక ట్రెయినుల వేళలు కొద్దిగా మార్చబడినవి. వివరములకుగాను ప్రజలు నెం. 98 రు. "టైంటేబిల్సు"గాని స్టేషనువద్ద షీటు టైంటేబిల్సుగాని చూచుకొనవచ్చును. లేదా, ఆయా స్టేషను ఉద్యోగులను అడిగి తెలిసికొనవచ్చును.

బ్రాడ్ గేజిమీద ఏలూరు, కాకినాడపోర్టు మధ్య నడచు పగటి ప్యాసెంజర్ ట్రెయినులు నెం. 169 రు. నెం. 170 రు. ఏలూరు వాల్తేరు మధ్య నడచును. ఈ ట్రెయినులను అందించుచూ, ఒక ఎక్స్‌ట్రా లోకల్ ట్రెయిను, చెరిపల్లినుండి సామర్లకోట కాకినాడ మధ్య నడచును. ఇదివరకు మద్రాసు ఖుర్దారోడ్ మధ్య నడచుచున్న ప్యాసెంజరు ట్రెయినులు, ఇపుడు మద్రాసు విశాఖపట్నంల మధ్య నడచును. బారింగుపేట - మారికుప్పం బ్రాంచిమీద ఇపుడు బారింగ్‌పేట నుండి ఊర్గాంపేటవరకు నడచుచున్న ఉదయవేళల ట్రెయిను చాంపియన్ వరకు చాంపియన్ నుండియును విస్తరింపబడును. క్రొత్త ట్రెయినులు ఏర్పాటు చేయబడినవి. అవి మద్రాసు సెంట్రల్‌నుండి గం. 07-35 ని. లకు ఆవడీకి, గం. 19-22 ని.లకు తిరువళ్లూరుకు బయలుదేరును. ఆవడినుండి గం. 08-43 ని.లకు మద్రాసు సెంట్రలుకు బయలుదేరును. తిరువళ్లూరు పోవు ట్రెయిను మద్రాసు సెంట్రల్‌నుండి గం. 15-35 ని.లకు బయలుదేరి పట్టాభిరాంవద్దకూడ ఆగును.

మీటర్ గేజిమీద గుంతకల్లునుండి మచిలీపట్నముకు నడచు సాయంత్రం ప్యాసెంజరు ట్రెయిను, రావులపురం, మునుమాక, సాతులూరు, నరసరావుపేట, పేరిచర్ల, నంబూరుల వద్ద ఆగదు. బెజవాడనుండి గం. 2.50 ని.లకు బయలుదేరు ప్యాసెంజరు ట్రెయిను గం. 07.00 ని.లకు బయలుదేరి, మచిలీపట్నం గం. 11.45 ని.లకు బయలు గం. 15.05 ని.లకు చేరును. వేలూరునుండి గం. 19.30 ని.లకు బయలుదేరు ప్యాసెంజరు ట్రెయిను గం. 16 35 ని.లకు బయలుదేరి, విజయవాడ గం. 23.35 ని.లకు బయలు గం. 20.50 ని.లకు చేరును.

### మద్రాసు సెంట్రల్‌వద్ద ముఖ్యమైన ట్రెయినుల రాక పోకలు

| | పోక | రాక |
|---|---|---|
| బెంగుళూరు ప్యాసెంజరు | 6-40 | 5-37 |
| బొంబే ఎక్స్‌ప్రెస్ | A 7-10 | B 19-15 |
| వైజాగ్ ప్యాసెంజరు | 8-10 | 11-30 |
| రాయచూర్ ప్యాసెంజరు | 8-45 | 17-55 |
| గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ | C 10-05 | D 17-05 |
| జోలార్పేట ప్యాసెంజరు | 11-30 | 13-20 |
| చిట్టమూరు ప్యాసెంజరు | 12-40 | 15-50 |
| బెంగుళూరు ఎక్స్‌ప్రెస్ | 12-50 | 15-40 |
| కొచ్చిన్ ఎక్స్‌ప్రెస్ | E 17-30 | F 09-05 |
| రేణిగుంట ప్యాసెంజరు | 17-35 | 09-48 |
| కలకత్తా మెయిలు | G 18-25 | H 08-05 |
| ఆర్కోణం ప్యాసెంజరు | 18-32 | *21-30 |
| మంగుళూరు ఎక్స్‌ప్రెస్ | J 19-15 | K 07-30 |
| వైజాగ్ ప్యాసెంజరు | 19-30 | 20-25 |
| ఉదకమండలం ఎక్స్‌ప్రెస్ | L 20-10 | M 07-10 |
| బొంబే మెయిలు | N 20-50 | P 07-[illegible] |
| బెంగుళూరు మెయిలు | 21-15 | 08-15 |
| బెంగుళూరు ప్యాసెంజరు | 21-30 | 20-35 |

* రేణిగుంట నుండి

A. బొంబాయి రాక మరునాడు గం. 13-30 ని.లు. అన్ని వైపులకు గుంతకల్ వద్ద కనెక్షనులు.
B. బొంబాయి నుండి పోక లోగడ దినము గం. 18-40 ని. డిటో
C. ఢిల్లీ రాక మద్రాసు నుండి బయలుదేరు రోజుతో సహా మూడవ రోజు గం. 6-30 ని.
D. ఢిల్లీ నుండి పోక గం. 18-00 లు. ఢిల్లీనుండి బయలుదేరిన రోజుతో సహా మద్రాసును మూడవ రోజు చేరును.
E. కొచ్చిన్ రాక మరునాడు గం. 12-30 ని.
F. కొచ్చిన్ నుండి పోక లోగడ దినము గం. 18-10 ని.
G. కలకత్తా రాక గం. 10-30 ని. మద్రాసు నుండి బయలుదేరు రోజుతో సహా మూడవ దినము.
H. కలకత్తా నుండి పోక గం. 14-45 ని. కలకత్తా నుండి బయలుదేరు రోజుతో సహా మూడవ దినము మద్రాసు చేరు.
J. మంగుళూరు రాక మరునాడు గం. 17-10 ని.
K. మంగుళూరు నుండి పోక లోగడ దినము గం. 8-25 ని.లు
L. ఉదకమండలం రాక మరునాడు గం. 12-45 ని.
M. ఉదకమండలం నుండి పోక లోగడ దినము గం. 18-10 ని.
N. బొంబాయి రాక గం. 7-20 ని. మద్రాసు నుండి బయలుదేరు రోజుతో సహా మూడవ దినము.
P. బొంబాయి నుండి పోక గం. 21-50 ని. బొంబాయినుండి బయలుదేరు రోజుతో సహా మద్రాసు మూడవ రోజు చేరును.

(N, P:) అన్ని వైపులకు గుంతకల్ వద్ద కనెక్షను.